అంకితం:

# నార్ల వెంకటేశ్వర రావు

గా రి కి

బా ల సా హి తి
మారీసు పేట : : తెనాలి

జనరల్ ఎడిటర్ :

చ ల ప తి రా వు

---

మొదటి ముద్రణ
దుర్ముఖి, శ్రావణం
మూల్యము 2-0-0

ముద్రణ
భారతమాతా ప్రెస్, మదరాసు-1.
వర్ణ చిత్రాలు
బి. ఎన్. కె. ప్రెస్, లిమిటెడ్

ఇందులోని చాలా గేయాలకు రవీంద్రుని రచనలు ఆధారం - ఈ గేయాలను తమ పత్రికలలో ప్రకటించిన, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, జ్యోతి, ప్రజామత, సంపాదకులకు రచయిత సర్వదా కృతజ్ఞుడు.

# పరిచయ వాక్యములు

డా॥ శ్రీ గిడుగు వేంకటసీతాపతి

బాలసాహిత్య మీ శతాబ్దములోనే పుట్టి బాలబాలికలవలెనే తప్పటడుగులు వేస్తూ, జిలిబిలి చిలుక పలుకులు పలుకుతూ, ముద్దులు గులుకుతూ, పెద్దల దీవనలతో పెరుగుతూ ఉన్నది. బాల సాహిత్య రచనలు సాగిస్తూ ఉన్నవారిప్పుడిప్పుడు లెక్కకెక్కువగుతున్నారు. కాని, ఈ రచనలో సిద్ధహస్తులయిన వారు కడు కొద్దిమంది మాత్రమే కనబడుతున్నారు. వారిలో ఈ 'వెలవంక' రచించిన శ్రీ కవిరావుగారు పేర్కొనదగినవారు.

శ్రీ కవిరావుగారు చిన్న పిల్లలతో సమముగా ఆడుకోగల సౌజన్యము గలవారు; చిన్నపిల్లల చిత్తప్రవృత్తులను లెస్సగా గుర్తించిన వారు. చిన్న పిల్లల మృదుమధుర భావాలను, అవ్యాజము పవిత్రమునైన వారి యనురాగమును, అవ్యక్తములయినను రసవంతములయిన వారి సల్లాపములను, ఊహతో విచిత్రముగా వారు కల్పించుకొని యాకర్షకముగా గావించు క్రీడలను, సహజముగా తమ కలపడిన నడకలతో కూర్చి వారు పాడుకొను పాటలను శ్రీ కవిరావుగారు శ్రద్ధతో కనిపెట్టి, తాము కన్నవి విన్నవీ ఊహించుకొన్నవీ అన్నీ కలిపి ఈ గేయాలు రచించి బాలబాలికలకు హృదయ పూర్వకమయిన తమ దీవనలతో కానుకగా అర్పిస్తున్నారు.

ఈ గేయములు నేటి బాలబాలికలకే కాక రానున్నతరముల బాల బాలికలకు కూడా వినోదమును విజ్ఞానమును సమకూర్పగలవు. ఇందు కొన్ని పదములు కేవలము చిన్నపిల్లల భాషలో ఉన్నవి; కొన్ని పదములు

చిన్నపిల్లలు నేర్చుకొనగల భాషలో ఉన్నవి: కొన్ని పదములు వారి అవగాహనకు మించియున్నవి. కనుక, ఈ పదములకు మారుగా వారి కందుబాటుగల పదములు కావలసి యున్నది. రాబోవు ముద్రణమందు ఈసవరణ శ్రీ కవిరావుగారు సులువుగా చేసికోగలరని నానమ్మకము.

ఈగేయముల మంచి చెడ్డలను తెస్సగా గుర్తింప గలవారు చిన్న పిల్లలే. ఏయేగేయములను పిల్లలు తాము విన్నవెంటనే మరియొకసారి వినుటకును, చదివిన వెంటనే మరియొకసారి చదువుటకును అభిలషింతురో, ఆ గేయములు ప్రశస్తములయినవని నమ్మవచ్చును. అసూయలేని నిష్కల్మష హృదయులు కనుక తమ చిత్తములను రంజింపజేయు గేయములను - అవి ఎవరు రచించినాసరే—పదేపదే పాడుకొంటూ ఆనందించ గలరు. అందుగల అర్థము అప్పటికి పూర్తిగా తెలిసికోలేక పోయినా, తెలిసికొన్నంతవరకు అర్థముచేసికొని, ఆనందించి పెద్దవారయిన కొలదీ అందలి భావములను ఇంతకంత ఎక్కువగా తెలిసికొని ఆనందిస్తారు.

శ్రీ కవిరావుగారు రచించిన ఈ గేయాలలో మురారీకథ, వీరగాథ, కట్టుకథ వంటివి కథాగేయములుగా కనబడునే కాని, అవి వట్టి వృత్తాంత కథనము గలవికావు. చమత్కృతిగల భావములతోను, వర్ణనలతోను రసవంతముగా రచితము లయినవి. 'నాన్నంతయితే', 'సంపెంగ' మొదలయిన పెక్కుగేయాలలో చిన్నపిల్లల ఊహ ఎంతదూరము విహరింప గలదో తెలియగలదు. 'అమ్మదిగులు' వంటి కొన్ని గేయాలలో పిల్లల జాలిగుండెతనము, సానుకంపము, 'పాప కాపురము' వంటి కొన్ని గేయాలలో బాలికలకు సహజముగా అలవడు పొదుపరితనము చక్కగా చిత్రింప బడినవి. చిన్నపిల్లల ఆటలు, పాటలు, చిత్తప్రవృత్తులు ఎట్లు ముద్దులు మూటకట్టు నట్లుంటవో అనేక గేయాలలో వ్యక్తమగుతూ ఉన్నది.

ఇన్ని చక్కని గేయాలు రచించి బాలానందమును సమకూర్చిన శ్రీ కవిరావుగారిని నేను మనసార అభినందిస్తున్నాను. వీరికృషి ఇతోధికముగా వృద్ధిపొందునుగాక!

# చిత్ర పరిచయం

## శ్రీ సంజీవ దేవ్

కంటికి రూపం, చెవికి శబ్దం.

ఒక వ్యక్తి మనతో గోడకవతల వుండి మాట్లాడుతూంటే, ఆ మాటల్ని మనం బాగా అర్థం చేసుకో లేము. అందుకు కారణం శబ్దానికితోడు రూపం మనముందు లేకపోవటమే. కంటికి రూపం గోచరిస్తూన్నపుడే శబ్దం యొక్క అర్థం సుబోధక మవుతుంది. అందుకనే పుస్తకాలకు బొమ్మ లవసరం. ఇక పిల్లల పుస్తకాలకు మాటలకంటే బొమ్మలే ప్రధానం.

శరీరంలోని యితర అవయవాలన్నిటికంటే, మనసులో కంటికే అధిక సంబంధం. అందుకే మనసులో విషాదం కలిగినా, ఆనందం కలిగినా, కన్నీటి ద్వారా వ్యక్తమవడం. అందుకే కన్నీటికి, పన్నీటికంటే సౌరభం అధికం. పన్నీరు విలువ పార్థివం, కన్నీరు విలువ అపార్థివం. కన్నుకూ మనసుకూ ఇంత సన్నిహిత సంబంధం వుండబట్టే మానవుడు చెవిటి కావటానికి ఇష్టపడతాడు, మూగి కావటానికి సందేహించడు; కాని గ్రుడ్డి కావటానికి మాత్రం ఇష్టపడడు. కనుకనే చిత్రరచన భావాభివ్యక్తికి అంత సహజ సాధన. ఇంకా పిల్లల విషయంలో చెప్పేదేముంది? వాళ్ళకు కన్ను తెరిస్తే బొమ్మలు, కన్ను మూస్తే బొమ్మలు.

'నెలవంక'కు చిత్రాలు రచించిన శ్రీ సుబ్బారావు ఇటలీ, ఇంగ్లండు దేశాల్లో చిత్రరచన నభ్యసించి, తదితర పాశ్చాత్య దేశాల్లో పర్యటించి, మన దేశం తిరిగి వచ్చారు. అదివరలో శాంతినికేతనంలో ప్రాచ్యశైలిలో చిత్రరచన నభ్యసించి, అందులో సిద్ధహస్తులై వుండటంతో, ఇటలీ నుంచి తిరిగి వచ్చిన పిమ్మట, సుబ్బారావుగారి చిత్రకళ ప్రాచ్య పాశ్చాత్య శైలులకు సమ్మేళనమైంది. ఆ కారణానే ప్రాచ్యుల భావ పరిమళం, పాశ్చాత్యుల రూపపుష్టి కూడ మనకు ఇందులో గోచరిస్తుంది.

"నెలవంక" లోని చిత్ర రచనలో వున్న మరో విశేష మేమంటే, బొమ్మలు 'బొమ్మలు' గా మాత్రమే గోచరిస్తవి కాని సృష్టిలోని యదార్థ రూపాలుగా గోచరించవు. బొమ్మను 'బొమ్మ'గా చిత్రించగలిగినప్పుడే చిత్రకారుని నైజప్రతిభ వ్యక్తం కాగలదు. రెండు ఆయతనాల (Two dimensional) సమతల ప్రదేశం మీద, వెలుగు నీడల (Light and shade) ద్వారా యదార్థ రూపాలయొక్క మూడుఆయతనాల ఇంద్రజాలాన్ని సృష్టించటం, నిజమైన కళాకృతి కాక, అను కృతి మాత్రమే అవుతుంది. రెండు ఆయతనాల సమతలం మీద, ఈ చిత్రకారుడు రెండు ఆయతనాల చిత్రాన్ని సృష్టించి నిజమైన కళాకారుడైనాడు.

ఇక పిల్లల పుస్తకాల్లోని బొమ్మలు పిల్లలు చిత్రించి నట్లే వుండాలి. "నెలవంక" లోని బొమ్మలు పెద్దలు చిత్రించినట్లున్నవా మరి? అందులోనే వుంది సిద్ధహస్తుని చాతుర్యం.

సాధారణంగా మౌలిక కళాకారుడు తన స్వంత అను భూతులకే రూపకల్పన చేయగలడు కాని, ఇతరుల భావాలను

అనుసరించి చిత్రించ లేడు. గొప్ప జంత్ర వాయకులు ప్రక్క వాద్యం వాయించ లేరన్నే. కాని శ్రీ సుబ్బారావు రెండు పనులూ సమాన ప్రతిభతో చేయగలరని ఆయన సృష్టి పరికించిన వారందరికీ తెలుస్తుంది.

బొమ్మను గురించి మాటల్లో వర్ణించటం కష్టం.

కారణం, బొమ్మలు కంటికి చెందినవి; మాటలు నాలుకకు. బొమ్మల్ని గురించి మాట్లాడేందుకు కంటికి నాలుక వున్నదా మరి?

అందుకే సుప్రసిద్ధ జపాను కళావేత్తా పండితుడూ అయిన 'ఒకాకురా కకూజో' ఇలా అన్నాడు "Words cannot voice his delight, for the eye has no tongue."

అందుకని సుబ్బారావుగారి చిత్రాన్ని గురించి అతిగా మాటల్లో వర్ణించటం అనుచితం. చిత్రాలు వాటికవే తమ సుందర సందేశాన్ని అందజేయ గలవు. ఇందులోని కవిత లకు చిత్రాలు ప్రతిబింబాలా, లేక, కవితలే చిత్రాలకు ప్రతి ధ్వనులా అనే సందేహం రానే రాకూడదు. కారణం, రెండూ కూడ నిజమే!

కవి మాటలతోనూ, చిత్రకారుడు రేఖలతోనూ, ఈ "నెలవంక"ను నిర్మించి, ఆంధ్ర బాల బాలికల హృదయాల్లో (యదార్థానికి పెద్దల హృదయాల్లోకూడ) మాటల సంగీతాన్నీ, రేఖల నృత్యాన్నీ రేకెత్తించినందుకు యీ స్రష్టద్వయం చాల ధన్యమయింది. మాటలకు రేఖలూ, రేఖ లకు మాటలూ. మాటల మాధురిని రేఖలూ, రేఖల మాధురిని మాటలూ చవిచూస్తున్నాయి. రెంటి మాధురినీ చవిచూస్తాయి చిన్నారుల సున్నిత హృదయాలు.

## ముద్దు మాటలు

చిలుక ననుకోవె నీ
చిన్నారి కాననుకొ,
'కిల కిలా' మని వచ్చి
పలుకరిస్తాననుకొ,

పట్టి పంజరములో బంధించు తావా?
పట్టికే నను విడిచి పెట్టి వేస్తావా?

పట్టి బంధించితే
ఎట్టులో తప్పుకొని,
అగుపించకుండ నే
నెగిరి కానల కేగి

మరలి రానే రాను మాటాడ నింక
పలుకనిక నీ వెంత బ్రతిమాలు కొనిన.

కుక్క పిల్లగ నేను
ప్రక్క వాటుగ వచ్చి,
ముట్టె నీ కంచాన
పెట్టినా నను కోపె !

'ఛీ ఛి' పొమ్మని నన్ను ఛీదరిస్తావా ?
చేర దీసుక నన్ను ఆదరిస్తావా ?

ఛీదరి స్తే యింక
నా దారి నే పోదు,
లేదు పొత్తిక మనకు
లేదమ్మ లేదమ్మ !

ముద్దివ్వ నింక నీ వద్దకే రాను
ముట్టనిక నీవేది పెట్ట వచ్చినను.

*

# పడవల పందెం

కాల్వలో వేతు నా
కాగితపు పడవల్ని
ఖండ ఖండా లెల్ల
గాలించి రాగ

కాల్వలో వేతు...

నా యూరు నా పేరు
వ్రాయించు దానిపై
నావ చూడంగానె
నా గొప్ప తెలియాలి.

కాల్వలో వేతు...

మా తోటలో మంచి
మంచి పువ్వులు కోసి
ఎన్నెన్నొ దేశాల
కెగుమతులు చేయాలి:

కాల్వలో వేతు...

ఏ రేవు చూసినా
నా పడవలే నిండి
'మన' పేరు లోకాల
మార్మోగి పోవాలి
కాల్వలో వేసు...

అదిగదిగో, ఆ నీలి
ఆకాశ మార్గాన
తెల్ల మబ్బులు తేలె
తెరచాప లెత్తుకొని.

చాలు గాలికి వాని
వడలినా చెవ్వుతో
పంపెగా లోకము నా
పడవలను చూసి;

మబ్బు పడవల కంటె
దబ్బు దబ్బున పోయి,
మిన్ను మన్నును దాటి
యున్న చోటికి పోను,
కాల్వలో వేసు...

*

# వీరు-మేము

పెద్ద వారల కంటె
బుద్ధి మంతులము,
ముకు పచ్చలారనీ
ముద్దు పాపలమైన

పెద్ద వారల కంటె
బుద్ధిమంతులము.

హెచ్చు వేతల తోడ
పిచ్చి కూడికలతో
సంతోషమే లేక
సతమత మ్మయ్యేదరు ;

పుడక లాకులు కొన్ని
ప్రోగు చేసుక మేము
అన్ని వేళలయందు
ఆడుకొందుము కనుక ;

పెద్ద వారల కంటె
బుద్ధి మంతులము.

వెండి బంగారాల
వెఱ్ఱి మోహములోనె
అను దినమ్మును మీరు
ఆరాట పడుచుంద్రు ;

పట్టివట్టి వంట
వండి మట్టిలో మేము
అందులో ఆనంద
మనుభవింతుము కనుక.

పెద్ద వారల కంటె
బుద్ధి మంతులము.

ఆశ కంతము లేదు
చిన్న సామెత యందు
కాలమ్ము వ్యర్థముగ
గడిపి వేతురు మీరు ;

అంది నట్టిదె కాక
అన్య మెరుగక హాయి
హాయిగా యెల్లప్పు
డాడుకొందుము కనుక,

పెద్ద వారల కంటె
బుద్ధి మంతులము.

మట్టి మాణిక్యముగ
మలచి ఆటాడగల
కళ ముద్దు పాపలకే
కరతలా మలకంబు;

ఆనందమును పొందు
ఆటలన్నీ మరచి
పిచ్చి ఆటల నేడు
ప్రేమించుచున్న మీ,

పెద్ద వారల కంటె
బుద్ధి మంతులము.

*

# పూల బాలలు

ఈల పాటలు పాడు కొంటూ
గాలి బాలలు పిలువ గానే,
కోలకరిని మేఘమ్ము పెళపెళ
తప్పెటలు ప్రయోగించ గానే,

వస్తుగా గమ్మత్తుగా పూ
గుత్తులెన్నో పైకివచ్చును

అమ్మ చెప్పవె !
అమ్మ చెప్పవె !

వాన చినుకులు చల్లి పోయెనో ?
వాయు బాలికె అల్లి పోయిరో ?

వింత వింతల రంగు రంగుల
అంత చక్కని పూల బాలలు,
ఇంత కాలమునుండి యెచ్చట
అంతు తెలియక దాగినారే?

వానకాలము రాగ బయటికి
వచ్చునేటికి ? తెలియ కున్నది

అమ్మ చెప్పవె !
అమ్మ చెప్పవె !

పుడమి గర్భములోన నిత్యము
ఒడికి పోవున పూల బాలలు ?

వర్షకాలము వచ్చినప్పుడు
వాటి కెంటికి సెలవ లిత్తురు ?
అందుకే కాబోలు నమ్మా !
చిందు లేయుచు వచ్చు పూవులు.

తారకల పోలి పేర కవ్వలి
వారి యింటికి పోవునమ్మా !

అమ్మ తెలిసెనె !
అమ్మ తెలిసెనె !

అమ్మ వుండును వారి కచ్చట
అందుకే హస్తములు చాచుట.

*

## 'నాన్నంతైతే!'

చిన్ని పిల్లవాణ్ణే గనుక
నన్ను లెక్క చేయ రెవరు
నాన్నంతైతే! అప్పుడు
అన్ని అతని ఇష్టమంట్రు.

చిన్ని పిల్లవాణ్ణే గనుక
నన్ను లెక్క చేయ రిపుడు.

ఎప్పుడైనతె పంతులయ్యే
వెప్పరముగ నన్ను పిలిచి
'పలకా బలపం తేవేఁ
బడికి వేళకాలా?' అన;

నవ్వుచు 'మాష్టారు! నేను
నాన్నంతైతని నాకిక
చదువు దేనికండి?' అనగ
మది లోపల నొచ్చుకొనుచు;

'అవు నతని పసువేటికి ?
అన్ని చక్కా దిద్దగలడు,
వాడిక పాతాలు పదల
వచ్చు' నను గురువుగారు.

చిన్ని పిల్లవాణ్ణే గనుక
నన్ను లెక్కచేయ రెవరు
నాన్నంటైతే ! అప్పుడు
అన్ని అతని ఇష్ట మంత్రము.

ముస్తుల సవరించి నేను
ముస్తాబుగ బయలుదేరి,
శివరాత్రికి పోవుచుండ
చిన్ననాన్న వెంటనుబడి :

'మారిపోదు వెనుకికేరా !
మరలి రమ్మ' నంగ నేను :
'నాన్నంటైతని నే బరు
నాన్న తిరిగి రాగల' నని,

చిన్నవాడు రోతోపల
చిన్నవోయి 'వా నతంటు
అరుగ గలవు యెచటికైన
తిరుగ గలవు, నిజమె' అనును.

చిన్ని పిల్లవాణ్ణి గనుక
నన్ను లెక్కచేయ రెవరు,
నాన్నంటైతే అప్పుడు
అన్ని అతని ఇష్టమంద్రు.

దాది రాగ కొట్టుతీసి
ధాన్యమిచ్చు చుండ నేను,
వాడనె మా అమ్మ జలక
మాడి వచ్చి నన్ను జూచి:

'అల్లరి చేస్తుంటి వేమి ?'
టనగ నేను అమ్మతోడ :
'నా దాదికి ధాన్యమిత్తు
నాన్నంటైతిని నే' నన :

'పెద్దవాడు గనుక ఇంక
పెత్తనంబు చేయగలడు,
అన్ని అతని ఇష్టమంక
అడుగనేల?' అనును అమ్మ.

చిన్న పిల్లవాడే గనుక
నన్ను లెక్క చేయ లేదు.
నాన్నంటైతే! ఎప్పుడు
అన్ని అతని ఇష్టమండ్రు.

చిన్నచిన్న పెన్సు-యాలు
చిన్ని సిల్కు చొక్కాయిలు
నాన్నగారు పట్నాలో
నాకు తెచ్చి పెట్టినారె:

'నాకు చాల వెండుకండి
నాన్నగారు! తెచ్చినారు?
అన్నయ్యకు యిచ్చివేయు,
మందు నవ్వు నాన్నగారు:

‘అవు నటండు పెద్దవాడు
అతని కెట్లు చాలు నివ్వి ?
అన్నితానె తెచ్చుకొనుసు
అతని కేమి ?’ అనును నాన్న.

చిన్ని పిల్లవాణ్ణి గనుక
నన్ను లెక్కచేయ రెవరు.

వేణు పరుగులెత్తి వచ్చి
‘వేగమె రావేర ! గాలి
పటము గట్టుకొంద’ మనగ
‘పకపక’ మని నవ్వినేసు !

‘చిన్న పిల్లవాడ నటర ?
నాన్నంతైతిన ఇప్పుడు ?
నలుగు రే మనసు కొందురు ?
నవ్వరటర నన్నుజూచి ?

‘ఆట లేమిటోయి ! పోయి
పాతాలను చదువు కొనక ?
తోటివారి చూడు’ మనగ
మాటలాడ కతడు పోవు.

చిన్ని పిల్లవాణ్ణి గనుక...

*

# యక్షప్రశ్న

పాఠాలు చాలింక
పగలు పంద్రెండాయె,
హాయిగా నవ్వింక
ఆడుకో నివ్వవే
పాఠాలు చాలింక....

మద్దినపు టెంత 'చుర
చుర' ని మాడుస్తుండె
అల్లదే కసు మాకు
లల్లాడుతే లేదు.

పొలములో ఒంటరిగ
కలుపు తీసెడి నాన్న
ప్రొద్దెక్కె నని పైకి
పార జూస్తుంటాడు.

'అవు నకండు పెద్దవాడు
అతని కెట్లు చాలు నివ్వి ?
అన్నితానె తెచ్చుకొనును
అతని కేమి ?' అనును నాన్న.

చిన్ని పిల్లవాణ్ణి గనుక
నన్ను లెక్క_చేయ రెవరు.

వేణు పరుగులెత్తి వచ్చి
'వేగమె రావేర ! గాలి
పటము గట్టుకొందు' మనగ
'పకపక' మని నవ్వినేను !

'చిన్న పిల్లవాడ నటర ?
నాన్నంతైతిన ఇప్పుడు ?
నలుగు రే మనసు కొందురు ?
నవ్వరటర నన్ను జూచి ?

'ఆట లేమిటోయి ! పోయి
పాఠాలను చదువు కొనక ?
తోటివారి చూడు' మనగ
మాటలాడ కతడు పోవు.

చిన్ని పిల్లవాణ్ణి గనుక...

*

## యక్ష ప్రశ్న

పాతాలు చాలింక
పగలు పంద్రెం డాయె,
హాయిగా నన్నింక
ఆడుకో నివ్వావే
పాతాలు చాలింక....

మద్దినపు ఎెండ 'మల
మల' ని మాడుస్తుండె
అల్లదే కసు మాకు
లల్లాడు టే లేదు.

పొలములో ఒంటరిగ
కలుపు తీసెడి నాన్న
ప్రొద్దెక్కె నని పైకి
పార జూస్తుంటాడు.

మనము మన నీడపై
నడచు చున్నా మిపుడు
సందేహమే లేదు
సరిగ పంద్రెం డగును.

అమ్మ! నాకిప్పు డొక
అనుమాన ముదయించె,
తెలుప వమ్మా పండు
ఒలిచి పెట్టిన రీతి:

రాత్రిప్పు పంద్రెండు
రాగలుగు తున్నపుడు
పగలు పంద్రెండయిన
రాదేమె రాతిరి?

తెలుపవే మా అమ్మ
తెలుపవే అమ్మా!

★

# కాన్క

ఇంటి దగ్గర నీవు
ఉంటివసు కోవమ్మ !
వ్యాపారముకు నేను
ద్వీపాంతరము లరిగి,

తిరిగి తిరిగీ నేను
మరలి యింటికి వస్తు
వస్తు, నీకే కాన్క
తెస్తునో చెప్పుమో ?

ముందు కాంచన ద్వీప
మునకు పోవుదు నచట,
పొలము బంగారంబె
జలము బంగారంబె ;

దాపు అంచున రాతి
పడియుండు కుప్పలుగ
బంగారు సంపెంగ
పూవు లా దీవిలో!

పట్టి నన్నిటి నేను
బుట్ట అందున కూరి,
పూలన్ని నీకొరకు
పోగు చేసుక వత్తు —

తెరచాప లెత్తగా
తరువాత నా ఓడ
తిన్నగా రత్నాల
దీవులకు చేరుకొను.

రత్నాల దీవుల్లో
రత్నాలు ముత్యాలు
కొల్లగా నేలపై
చల్లి యుండు నటమ్మ!

మిరుమిట్లు గొలిపేటి
ముత్యాలు రత్నాలు
ఏరి తెత్తును నీకు
కోరి తెత్తును నేను —

అటుపైన నా ఓడ
చిటికె లోపల పోయి
దాపులో గల వింత
ద్వీపంబు చేరుకొను.

అందులో ఉన్నట్టి
వన్ని గమ్మత్తులే!
చూడ వలెనే గాని
చెప్ప నెవ్వరి తరము?

తనకు తానే వ్రాయు
'పెన్ను' మా నాన్నకు,
ఎగిరి పోయే 'కీలు
గుఱ్ఱ' మన్నయ్యకు,

ఎన్నడూ కని వినీ
ఎవ్వరూ ఎరుగని
సొమ్ములెన్నో కాన్క—
అమ్మ! తెత్తునె నీకు;

ద్వీపాంతరము లేగి
వ్యాపారములు చేసి,
తిరిగి తిరిగీ నేను
మరలి వచ్చేటపుడు,

అమ్మ! నీకెన్నియో
సొమ్ములను తెచ్చెదను.



*

# అలుసు

అలుసుగా నన్నైతే
అంటావు గాని,
ఎన్ని చేసిన గాని
నాన్నారి పనవేం ?

అలుసుగా నన్నైతే
అంటావు గాని.

గాలి పడగకు చిన్ని
కాగిత మ్మడిగితే,
కన్ను మంటూ ఒంటి
కాలిపై లేస్తావు :

తెల్ల టావులు వ్రాసి
తెగ పాడు జేస్తుంటె
ఎన్నడైనా నాన్న
నన్నావతే అమ్మ ?

అలుసుగా నన్నైతె
అంటావు గానీ.

నాన్నారి బుక్కుపై
చిన్ని పెన్సిలు తోసు
'అ ఆ' లు వ్రాస్తుంటె
ఆగ్రహిస్తావు గద:

పగలు రాత్రియు ఆచే
పనిగ యేమేమిటో
నాన్నారు వ్రాస్తుంటె
నాకర్థ మవుతుందః

అలుసుగా నన్నైతె
అంటావు గానీ.

'నాన్నారు చదువు చు
న్నారు గోలేమి' టని
గదిలోని కేగితే
గదుము కుంటావుగద?

పెద్దగా వాస్నారు
పద్దెమ్ములను చదివి
రద్ది చేయరె నేను
దిద్దుకొను చుండగా ?

అలుసుగా నన్నైతె
అంటావు గానీ.

కొల్లగా గ్రంథాలు
అల్లుతా రంటావు
కమ్మగా నీలాగ
కథచెప్ప రేమిటే ?

అంతు లేనీ వ్రాత
అది ఏమిటే అమ్మ !
నిజముగా చెప్పవే
నీకర్థ మవుతుంద ?

అలుసుగా నన్నైతె
అంటావు గానీ.

*

# సంపెంగ

రెమ్మల లోపల చిటారు
కొమ్మల లేచిగురులపై,
కేరింతలు కొట్టుచు గా
లికి నాట్యము చేస్తుంటే,

అమ్మా! కనుగొనగలవే?
గమ్మత్తుకు సంపెంగ నై తె.

'కన్నా! ఎచ్చటరా?' అని
నన్ను నీవు పిలిచి నపుడు,
పలుకక లోలో మురియుచు
పళము విప్పి చూస్తుంటే,

అమ్మా! కనుగొన గలవే?
గమ్మత్తుకు సంపెంగ నై తె.

జలకమాడి సంపెంగ దా
పుగ పూజకు పోవు నపుడు ;
'కమ్మని వాసన పీల్చెద
వమ్మా ! అది నాదేనని

అమ్మా ! కనుగొన గలవే ?
గమ్మత్తుకు సంపెంగ నైతే.

మసక బడిన తోడనె నీ
పసిపాపగ మారి మరల
' అమ్మా ! ఒక కథ చెప్పవె '
అని నే బ్రతిమాలు కొంటె,

అమ్మా ! కనుగొన గలవే ?
గమ్మత్తుకు సంపెంగ నైతే.

' కొంటె వెధవ ! నీ వెచ్చట
నుంటి వింత సేపంటే,
' చెప్పనులే అమ్మా !' అని
తప్పుకొంటె మౌనంగా,

అమ్మా ! కనుగొన గలవే ?
గమ్మత్తుకు సంపెంగ నైతే.

*

## ఆటలు

ఆకాశ వీధిలో
    ఆడు కొనుటకు నిన్ను
మబ్బు బాలల్లు ర
    మ్మని పిలిచి నారమ్మ !

ఉదయ భానుని స్వర్ణ
రథ చేతనము లెక్కి,
నెలవంక చలువ వె
న్నెల చిగుళ్ళను మెక్కి
        ఆకాశ వీథిలో ...

పైరగాలి బయళ్ళ
పరవళ్ళు తొక్కుతూ
అస్తమానము వారు
ఆడుకొనుచే నంట
        ఆకాశ వీథిలో ...

ధ్రువ తారాగణము చేరి
చేయి తెత్తితె నన్ను
చేసికొని తమలోన
చేర్చు కొంటారంట
ఆకాశ వీథిలో...

'అమ్మ వెదకును రాను
పో' మ్మంటె సంతలో
తేలి యాడుతు పైరు
గాలిలో పోయారు
ఆకాశ వీథిలో...

మబ్బు నయ్యెడ చంద
మామ నీవగు మమ్మ!
అందాక పోనేల?
ఆడుకొందా మిచటె
ఆకాశ వీథిలో ...

*

౨

జలరాసిపై తిరుగు
  అలల బాలలు వచ్చి
కిలకిలా నవ్వుతూ
  పిలిచి పోయారమ్మ !

ఆటలతో పాటలతో
హాయిగా ప్రియగా,
కడలిపై కాలంబు
గడుపు చుండెద రంట
    జలరాసిపై తిరుగు ...

కను మూసుకొని నేను
గమనిపై నిలిచితే
క్షణములో వారు నను
కొనిపోదు మన్నారు
    జలరాసిపై తిరుగు ...

'అమ్మ నే విడి రాను
పొ' మ్మనంగా వారు
చిఱు నవ్వు లొలికిస్తు
పరుగు తీశారమ్మ !
జలరాశిపై తిరుగు ...

అలల నయ్యెద తీర
ఒగుమ నీ యొడిలోన
పొర్లుచూ నే పొర్లి
పొర్లి నవ్వెద నమ్మ:

మన జోలి ఈలోక
మున కేలనే అమ్మ !
హాయిగా మన మిచట
ఆడు కొందామమ్మ.
జలరాశిపై తిరుగు ...

*

# అమ్మ దిగులు

ఎప్పుడు లేనట్టి దిగులు
ఏల నీకు చెప్పవమ్మ ?

కదలక మెదలక యుంటున్న
ఎదలో తీరని బాధతో
వాస వచ్చి పడుకు ఉన్న
గాని మాటలాడ వేమె ?

గడియారము కొట్టె నాల్గు
గంట అదుగో, స్కూలు నుండి
అన్న వచ్చు వేళాయెను
అన్న మెరుగ నింత వరకు.

ఎప్పుడు లేనట్టి దిగులు
ఏల నీకు చెప్పవమ్మ ?

సంతోషం జస తెరుగప్ప
చింతగ కూర్చుందు వెపుడు,
చెప్పవె నాన్నారి జాబు
చేరలేద నేడు నీకు ?

సంచి నిండ తెచ్చి ప్రజకు
పంచి పెట్టు పోష్టు వాడు,
చదువు కొనుట వచ్చు నాన్న
జాబు లన్ని దాచు కొనుచు.

తెల్ల తావు లొక్క దస్తా
తెప్పించవె దాది తోడ,
నాన్న ఉత్తరాలన్నియు
నేనె వ్రాసి పంపు నీకు.

అక్షరాలు నాకు వచ్చు
‘అ’ నుండియు ‘ప ఫ’ వరకు
నవ్వెద వేమిటి కమ్మా !
నాకు చేత గాదనేన ?

అన్దముగా టైపు కొట్టి
అచ్చు గ్రుద్ది నట్లు వ్రాత,
చిక్కులేక విడి విడిగా
చెక్కెద పెద్దక్షరాలు.

పూర్తిచేసి నాన్న లాగ
పోష్టు వాని కివ్వ నమ్మ,
నాన్న లాగె నన్ను పిచ్చి
వానిగ భావింప కమ్మ!

ఆగకుండ వచ్చి నేను
అప్పుడే నే కిచ్చి వేసి,
చెప్పుచుంటు ప్రక్కనుండి
తప్పులు పోకుండ నేను.

మంచి మంచి ఉత్తరాలు
సంచిలోనె దాచుకొనును
అమ్మా! మన పోష్టువాని
నమ్మరాదు! నమ్మరాదు!!

★

# మరాఠీ కథ

ఎప్పుడూ పని యంచు
తప్పు కొంటుంటావు
కాదనక నేడైన
కథ చెప్పవే అమ్మా!

ఆడు కొనుటకు నాకు
ఆసక్తిగా లేదు
మబ్బు క్రమ్మెను పైన
మసకపడి పోయింది.

మేఘాలు గర్జించి
మీద బడుతున్నాయి
ముసురు యీదరగాలి
కసిరి కొట్టుచు నుండె.

పిడుగు పడునని లోన
ఒడెము బిడెముగ వుంది,
ఒడిలోనె కూర్చుందు
విడిచి పోవను నిన్ను.

కాదనక నేడైన
కథ చెప్పవే అమ్మ!

ఏడు సంద్రాలవల
దీవిలో నొక పుట్ట,
పుట్టపై నొక మఱ్ఱి
చెట్టు వుంటుందనీ;

మఱ్ఱి చెట్టుకు పెద్ద
తొఱ్ఱ లోగాపోగ
కోటలో మాయల మ
రాఠి వుంటాడనీ;

కోడె త్రాచులు చుట్టు
కొనిన పంజర మనీ,
అందులో ఒక చిలుక
అతని ప్రాణమ్మనీ;

చిలుక ప్రాణము కేసి
చెఱలోన పడియున్న
రాకుమారిని గావ
రాకుమారుడు వచ్చు.

కారు మేఘాలలో
జోరు వర్షంబుతో
ఘోర గుఱ్ఱము నెక్కి
స్వారి చేస్తూ తుపాను:

చీమల్లు దూరని
చిట్టడవులను దాటి
గండ భేరుండాలు
గల యరణ్యము గడిచి.

అతడు వెదకుచు వచ్చు
ఆ రోజు నేటివలె
నుండు నిజముగ దాని
నూహించుకోగలను

కాదనక నేదైన
కథ చెప్పవే అమ్మ!

కారు మేఘా లిట్లై
గర్జించు చున్నపుడు
మెరుపు మెరుపునకు కంపిల్లు
పిరత పాటే వేళ,

తండ్రి పెఖ యపాయించ
తన మీద ప్రాణాలు
పెట్టుకొని బాధతో
పొట్ట పూస్చుకు కుమిలి,

ముక్కై పోయిన పాడు
మొక్క జొన్నలు తినెడి
పల్లి నప్పుడు తాను
తలచు కొనదా? అమ్మ!

కాదనక నేడైన
కథ చెప్పవే అమ్మ!

ఆకాశమున మబ్బు
లావరించుచు నుండె
భీకరముగా చిమ్మ
చీకటులు క్రమ్మినవి.

పని పాటలను మాని
ప్రజ లెల్ల మబ్బులను
చూర్ల క్రిందుగ దొంగి
చూచు చున్నా రదుగో!

పుస్తకాలను దాచి
పెట్టి యుంచితి నమ్మ!
చదువు నే తర్వాత
చదువు కొందును లేవె.

'చదువు చదువు' నన్ను
చంప కే మా యమ్మ
నేను నాన్నంతై తె
నేర్చుకో గల నపుడె.

కాదనక నేదైన
కథ చెప్పవే అమ్మ!
ఎప్పుడూ పని అంచు
తప్పు కొంటుంటావు.

★

## బోటు షికారు

నేను పెద్దవాడనైతె
దోనె నడుపు బెస్త నగుదు
ఏరు దాటి లంకలన్ని
కోరి చూచి వత్తు నమ్మ!

నేను దోనె నడుపుచుండ
స్నాన మాడు చున్న వాలు
రందరు నను జూచి మిగుల
ఆశ్చర్యము చెందవలయు.

నేను పెద్దవాడనైతె
దోనె నడుపు బెస్త నగుదు.

రెల్లుగడ్డి పెరిగి వెన్న
తెల్లగ తెగ పూచియుండు,
పాల కడలి వోలె కనుల
పండువ చేయుచు నుండును.

పొరలు పొరలు పేరి ఉడుడు
పొత్తిగుడ్డ పులిపినట్లు
ఎగిరి దానిపైన గంటు
వేయుచుండ నెంతహాయి !

నేను పెద్దవాడనైతె
దోనె నడపు బెస్త నగుదు.

వరద వచ్చి ఒలిసియున్న
ఒరద అంక అన్నిటిపై
పిట్ట లెన్నొ క్రొత్త ముగ్గు
పెట్టినట్లు ముచ్చటగా ;

పచ్చియుసిరి పెలగట్లు
పుచ్చకాయ ఫలహారం
మొక్కజొన్న పాలకండె
మెక్కుచున్న కొలది రుచులు.

నేను పెద్దవాడనైతె
దోనె నడపు బెస్త నగుదు

‘లే లె’ మ్మని మంచెపైన
కొంచి కాపు లరచి అరచి
గిరగిర ‘వడి శిల’ త్రిప్పగ
పరుగులెత్తు పిరికి కాకి.

అంత ప్రక్క లోతు లోతు
చింకె లుండు నంట చాల,
ఊటినేల యుంకు నంట
చోద్యమెల్ల చూచి వత్తు.

నేను పెద్దవాడనైతే...

ఆకసమ్ము ముని మాపై
కాటుకంటి రేగు నప్పుడు
అమ్మా! నాకొక అంచు
అన్న మడిగెదాను వచ్చి.

పట్టణా నికేగు నాన్న
పని పాటల లోన మరిగి
నిన్ను విడచి నాన్నలాగ
నేను పోవ నెచ్చటకును.

నేను పెద్దవాడనైతే...

# అల్లరి చెల్లాయి

అమ్మ ! మన చెల్లాయి
అల్లరీ పిల్లేమె ?
వివర మెరుగుసు వట్టి
వెఱ్ఱి బాగుల దేమె ?

మట్టి బెడ్డల పోసి
చిట్టి పిచతలతోన
వట్టొట్టి అన్నాలు
వండి వడ్డించితే,

మే మంత అల్లాగె
మెదల కుండా వుంటె,
అన్నమని గబగబా
మన్ను తింటుందేమె ?

అమ్మ ! మన చెల్లాయి . .

'అ ఆ' అని రెండు
అక్షరాలను వ్రాసి
దిద్దు కొమ్మంటేను
దిక్కులను చూస్తుంది,

తలక్రిందుగా త్రిప్పి
పలకపై బలపముతో
పిచ్చి గీతలు గీసి
పాడు చేస్తుందమ్మ!

అమ్మ! మన చెల్లాయి...

ఆటలో మే మిలా
'అమ్మ' 'అమ్మ' ను కొంటె
నిజముగా నమ్మింది
నీవు వచ్చా వంటు,

అందరకు తెలుసు అది
అమ్మ కాదని, కాని
'అమ్మేది ?' అని చెల్లి
అటు నిటూ చూస్తుంది.

అమ్మ! మన చెల్లాయి....

చంప డాముక పిల్ల
అందరము పండుకొని
'చందమామా! రావె
జాబిల్లి! రమ్మంటె,

అది చూచి చెల్లాయి.
'దిగిరావే?' అంటుంది
అందుకో వచ్చునని
అనుకొంది కాబోలు

అమ్మ! మన చెల్లాయి....

వీధిలో దీపికల
వినువీధి తారకల
తార తమ్యము కూడ
తనకు తెలియదు పైగ,

'పగలు చుక్కలు ఎందు
కగుపించ' వని యిల్లై
వింత ప్రశ్నలు వేసి
విసిగించి వేస్తుంది.

అమ్మ! మన చెల్లాయి...

'రాము' అంటే మేము
'లాము' అంటుం దేమే ?
ఎంత చెప్పిన వినదు
పంత మేమోకాని,

కసరుకొని నే నపుడు
కను లెఱ్ఱ చేసితే
పరిహాస మవి పైగ
'పకపకా' నవ్వింది

అమ్మ! మన చెల్లాయి...



*

## మారాము

పాపమని నేనేమి
బడిలోకి పోవాలి?
మీరేమి దొరలల్లె
మ్రింగి కూర్చుంటేను:

పాపమని...

కాళ్ళు చాపగ నీరు
కదల మెదలగ నీరు,
మేష్టారు గారసలు
మంచాడు కాదమ్మ.

పాపమని...

ఆట లొక్కటి కూడ
ఆడు కోనివ్వరేం
ఎప్పుడును పాతాలె
అప్ప జెప్పాలంట.

పాపమని...

'కప్ప' వారము నిన్న
తప్పు పోయిందంచు
కొట్టి తొడపాశంబు
పెట్టారు మేష్టారు.
పాపమని...

'పెళ్ళాయె అక్కాయి
బళ్ళోకి రా' దందు
వస్తైతె నాకూను
పెండ్లి చేయగ రాదొ?
పాపమని...

అమ్మ! నే బడికేగ
నన్నయ్య నంపవె!
ఇవ్వాళ నే పోను
ఎప్పుడూ నేనే న?
పాపమని

*

## ఆదివారము

అన్ని వారము లట్లు పరుగిడి
ఆదివారము రాదె చకచక ?
సోమవారము చూడు మెట్టుల
చోద్యముగ పరుగెత్తి వచ్చును !

అన్ని వారములట్లు పరుగిడి
ఆదివారము రాదె చకచక ?

కారు లెక్కియు సోమ మంగళ
వారములు తెగ తిరిగి వచ్చును,
వారు చూడగ యెవ్వరో పిల
వారి సుతులై యుండ వచ్చును!

కారు లెక్కియు సోమ మంగళ
వారములు తెగ తిరిగి వచ్చును.

అమ్మా! తెలిసెనె తప్పకుండా
ఆదివారము పేదవారము.
కారు లెక్కగ లేక చల్లగ
కాలి నడకనె వచ్చు పాపము!

అమ్మా! తెలిసెనె తప్పకుండా
ఆదివారము పేదవారము.

చల్లచల్లగ వచ్చి శీఘ్రమె
వెళ్ళుచుండును ఆదివారము,
ఇంటి పనులను దిద్దుకొనగా
వెంటనే చనుచెంచు నేమో!

చల్లచల్లగ వచ్చి శీఘ్రమె
వెళ్ళ చుండును ఆదివారము.

సోమవారము నడచి చల్లగ
ఆదివారము వడిగవస్తే!
హాయిగా ఎన్నెన్నొ సెలవలు
ఆటలాడగ వచ్చు నెప్పుడు;

సోమవారము నడచి చల్లగ
ఆదివారము వడిగ వస్తే!

*

# అమ్మా!

కమ్మని వాసనలను 'ఘుమ
ఘు'మ్మని పించెద, కొలనిలో
చిఱు కెరటమునై నే నిను
మరల మరల ముద్దాడెద.

అమ్మా! నే పిల్లగాలి
తెమ్మెరనై విహరిస్తే!

చిటపట చినుకుల భాషల
చెప్పెద చెవిలో గుసగుస,
తటిల్లతలుగా నినుగని
చిటి పొటి నవ్వులు నవ్వెద,

అమ్మా! నే తొలకరిమే
ఘమ్మై దివి విహరిస్తూ.

నక్షత్రాల దృక్కులలో నిను
చూచెద ఆకసము నుండి,
కొదమ చంద్ర కిరణమునై
హృదయాబ్జముపై వ్రాలెద.

అమ్మా! నే శరన్నిశి
ధమ్మయి నీ కగుపించక.

కలనై నీ కన్నులలో
కల్పించెద మధుర జగతి,
ఉలికి పడుచు లేచి నన్ను
మేలుకువలో కలయ జూతు.

అమ్మా! నే మిణుగురునై
చిమ్మ చీకటిని కలిసెద.

*

# వీరగాథ

ఊహించుకో అమ్మా!
ఊహించు కోవే,
ఊహించు కొంటు నీ
'వూ' కొట్టు చుంటవే.

వర్ణించి చెప్పితే
ఒడలు పులకించేటి
వీరగాథను నేను
వినిపింతు నిపు డొకటి:
అనగ ననగా ఒక్క
అతి ప్రమాదంబైన
దేశంబులో బయలు
దేరి పోతున్నట్టు

ఊహించుకొంటు నీ
'వూ' కొట్టుచుంటవే!

మందసములో నీవు
ముందు పోతుంటావు,
గుఱ్ఱంబుపై నేను
గునుకు తీస్తుంటాను,
మనిషి పురుగే లేని
మైదానముల గుండ
మనము పోగా పోగ
మసక బడి పోతుంది;
నేల తుప్పల తోడ
నిండి, బావురు మనును
అక్కడక్కడ కొన్ని
నక్క లఱచుచు నుండు,
కీచురాళ్ళకు చెవులు
'గింగు' రను చుంటాయి
'పీచు పీ'చ ని గుండె
పీకు చుండును నీకు;

ఊహించు కొంటు నీ
'వూ' కొట్టుచుండవే.

'ఎటకేగు చుంటిమో
ఎరుగ కున్నా మనసు'
అంచు భయపడతావు
ఆడి దానివి కనుక;
'దీనికే ఏ వింత
దిగులు పడతావేమె
'మనము' లేమాటె?' అంచు
మగ ధీరుడను కనుక;
ఇంతలో ఏ పేదో
వింత వెలుగును చూచి
చెవిలోన 'గుసగుసా'
చెప్ప బోవుచునుండ,
కొంప రేకలు వేస్తు
బండలను చే బూని
మొండి భూతాలెన్నొ
దండెత్తి వచ్చిన

ట్లూహించు కొంటు నీ
'వూ' కొట్టు చుండవే.

ఘాతాలు చూడగా
బోయీలు మొత్తమ్మ
దూరుకొని పొదలోన
చేరి కూర్చుంటారు;
'గడ గడా' నీవేమొ
వడకుతూ మీనాలో
ముక్కోటి దేవతల
మ్రొక్కు కొంటుంటావు;
'భయమేటికమ్మ! నీ
ప్రక్క నేనుంట' నని
దగ్గఱకు వచ్చి నే
ధైర్యంబు చెప్పిన

శ్లాఘించుకొంటు ప
'వ్వా' కొట్టుచుండవే.

'వచ్చినారా? యింక
చచ్చెదరు మీ' రంచు
చూర కత్తిని దూసి
చూపింతు వారలకు;

'వద్దురా! నీవు నా
వద్దనే ఉండరా!
బాబు! బాబూ!!' అంటూ
ప్రతిధ్వానాలు వుంటాయి:
'ఆగవే అమ్మా! న
న్నడ్డగించకు, వారి
అంతు దేల్చెద నా క
వెంత పని?' అంటూనే,
కాళ్ళతోన రిక్షాను
కదలించి విడువగా
ఆగ మేఘాలలో
అశ్వండె లేస్తుంది —
'టక టకా' గుట్టంటు
దవ్వుకు పిస్తుంటేను
దుమ్ము రేగుచు దారి
క్రమ్ముకొని పోతుంది:
భూతాలు నాపైకి
పరుగెత్తు కొస్తుంటె

‘హూ’ హుంకరించునే నహూం
తమ్ముగా దూకిన

ఉల్లాహించుకొంటు నీ
‘వూ’ కొట్టుచుండవే.

పండు పై బడి ‘తళ
త్తళ తళా’ మెరవంగ
పిడిబాకు త్రిప్పుచును
చెడుగుడాడిన యట్లు,
చెంగు చెంగున యెగిరి
రింగు రింగున తిరిగి
తుక్కు తుక్కుగ నరికి
ముక్క ముక్కలు చేతు—
తలలు బంతుల రీతి
‘గలగలా’ లేస్తుంటె
కనులార ఆ పోరు
కాంచగలవా? అమ్మ!
కత్తి ట్టున కొక్క
కుత్తు కెగరగ, వేడి

పేటి నెత్తుట తాన
మాడి పోయిను నేను:
కంతలును మొందెముల
కాల్పులా రక్తంబు —
వల్లకా పట్టిదాడు!
వర్ణింప లేనింక,

ఊహించు కొంటు నే
'హా' కొట్టుకుంటినే.

'అయ్యయ్యో! నాబిడ్డ
హాయిమారె' నని నీవు
బిక్క మొగమున వెక్కి
వెక్కి యేడుస్తుంటె,
గాయాల రక్తంబు
కారి పోవుచు నుండ
బాలసంట్రుని రీతి
ప్రత్యక్ష మౌతాను;
'అమ్మ యిప్పటికైన'
దనగ పరుగున వచ్చి

ఎత్తుకొని హృదయాన
హత్తుకొనెదవు నన్ను:
'నా బాబు లేకున్న
యేమౌదు నేను' అంటు
ముద్దిచ్చి లోలోన
మురిసి పోతావు నువు
'వీరమాత' ని ఎన్న
వీగుచూ లోలోన
పులకించి యొక వెల్ల
పొంగి పోదువు నీవు

ఊహించుకొంటూ నీ
'వూ' కొట్టుచుండవే.

వచ్చి అన్నయ్యతో
వర్ణించి చెపుతుంటె
వట్టి కోతలివంచు
వాగుతాడను కొంట?
'ఆమెదే జన్మ' అని
'అతడె పో సుతు' డంచు

మీరు నావోకటిగా
మారు మ్రోగునె అమ్మ !
'తిండి పోతా ! పెద్ద
ఉంవగా సరి యవర ?
చూసి వాళ్ళబ్బాయి
సిగ్గు వచ్చు' నటంచు,
'పేను' లేవటె ? నాడు
ప్రాణ స్నేహితు డతని
తిట్టి వాళ్ళమ్మ యిక
మొట్టి కాయలు వేయు.
ఎన్ని జరుగుట లేదె ?
ఇదిమాత్ర మసులేల
కొత్త తాళీయముగ
కలుగ కూడదె, చెప్పు ?



# కట్టు కథ

నరుని కంటను బడదు
నా రాజ భవనమ్ము,
చూచితే పైకెగిరి
చుక్కలందున కలియు

నరుని కంటను బడదు...

బంగారు బంగారు
సింగారముల తోడ
మెరిసి పోవును కనుల్
మిరు మిట్లు గొలుపంగ.

అందులో ఒక రాణి
ఆమె వీణా పాణి,
ఆభరణములు గల్గి
నా భవనమున వుంది.

రావమ్మ చెప్పెదను
రహస్యముగ నీకు
ఇక్కడే, మనగోడ
ప్రక్కనే వున్నదే
నరుని కంటను బడదు...

ఏడు సంద్రాలవల
మేడలో నొక మూల
మూసి పక్కని కన్నె
గాఢ నిద్రలో వుంది.

చెదరి పోయిన జుట్టు
చేతిగాజులు, రెండు
చెవుల పోగులు, కళ్ళు
చెదరి పోవుచు నుండె.

మంత్ర దండము త్రిప్పి
'మహంకాళి' అంటేను
చూచుకో! త్రుళ్ళిపడి
లేచి కూర్చుంటుంది.

నవ్వితే ఆ పిల్లి
నవరత్నములు రాలు.
నాకు తప్పక యింక
లోకులకు వెరువదే.

రావమ్మ చెప్పెదను
రహస్యముగ నీకు
ఇక్కడే మన గోవు
ప్రక్కనే వున్నదే

నిపుని కంటను చూసు...

జలము పెట్టుట కీవు
కొలని కేగంగానె
మెల్లగా నేను నా
మేడలో చేరెదను.

తోడ నెవ్వరును రా
కూడ దమ్మా మీరు
మన కుక్క 'జాకీని'
కొని పోము నప్పుడును;

నరుని కంటను బడదు
నా రాజ భవనమ్ము,
చూచిరే పై కెగిరి
చుక్కలందున కలియు.

రావమ్మ చెప్పెదను
రాహస్యముగ నీకు
ఇక్కడే మన గోప
ప్రక్కనే ఉన్నదే

నరుని కంటను బడదు...



# చుక్కలు

ఏను గూకితె వీథిలోనికి
నేను పోతే కోపగింతువు.
లెక్క లేని చిన్ని చుక్కలు
ఎక్కడెక్కడి నుండి వచ్చెనో!

హాయిగా ఆకాశ వీథిలొ
ఆటలాడుచు నుండె చూడుము.
వారలను లేపట్టి పిలచి
వచ్చె నేమిటి చెప్పవమ్మా?

ఏను గూకితె వీథిలోనికి
నేను పోతే కోపగింతువు?

చెట్టు లెక్కెద నంచు మరినను
కొట్ట వస్తివి గాని మొన్నా,
అంత ఎత్తున కెక్కె చుక్కలు
గంతు లేయుచు లేపటమ్మా!

అంత ఎత్తున పెక్కుటకు యె
ట్లనుమతించునె వారితల్లియు?
కాలు జారిన నేల బడునని
ఏల చెప్పదు తల్లి వారికి?

అమ్మ! చెప్పవె ఆకసంబున
'అమ్మ' వుండున అసలు వారికి?

అమ్మ వుంటే చిన్ని చుక్కల
చిమ్మచీకటి దిరుగ నిచ్చునె?
పెక్కు మాటికి మాటికాకస
మెక్కి గంతులు వేయనిచ్చునె?

వేడి నీటను స్నానమా రిచి
వేళ కన్నము పెట్టి నీవలె,
నీవు చెప్పిన యట్టి కథలను
నీతు లెందుకు చెప్పకుండు?

అమ్మవుంటే చిన్ని చుక్కల
చిమ్మచీకటి దిరుగనిచ్చునె?

★

# పిట్ట కథ

అమ్మా! మా బడికి పంతు
లమ్మ గారు వచ్చారే
బంతిపువ్వులాంటిదానో
బదిలీపై పోయారట
అమ్మా! మా బడికి...

పంతులమ్మ నిజముగానె
యెంతో మంచి దమ్మ నన్ను
కొట్టి విసుగు పడేదిలే
పిట్టకథలు చెప్పుచుండే
అమ్మా! మా బడికి...

నూతిదిబ్బ మీద రెంటు
రేతువ పిట్టలు గలవట,
చెట్టు మీద గూడు కట్టి
పెట్టుకొన్నవంట గుడ్లు.

పెంటిది రెక్కలను గప్పి
పొదుగుడు ప్రారంభించి
పున్నమి జారబడగానె
పిల్లలు వెలిసిండయ;

పోటు పొక్కాయి ప్రొద్దు
పోయి గూడు చేరగానె,
పెంటి పిట్ట మగనిని గని
కంట నీరు పెట్టిందయ;

'ఏమే' మని మొగుడడుగగ:
'ఏమని నే చెప్పుకొందు?
పెత్తనాలు చేసి యిపుడు
వస్తిరుగద యింటివైపు;

మిన్ను విరిగి పడితే నా
కన్ను వాలిపోదుసుమ.
ఏ దేవుని పుణ్యానో
యింతవరకు నిలిచెగాని!

చిన్నవారి చూస్తుంటే
కన్ను మూత పడదాయెను'
అని వలవల పెంట్ల మేస్కు
అన్నదంట పోతుపిట్ట:

'ఇంతగొడవ దేనికేన?
ఇంతగ భయమెందుకి చెప్పు,
కొమ్మ పైకె చూడు నీవు
కన్ను మూసుకొంటె చెలి;

అంతగ పైబడితే నే
నంటి తేల్చుకుంటాగా ?'
అని కొమ్మను పైకి చూసి
అలిసి నిద్దుర పొచ్చెను.

తెలతెల వారగ పక్షియి
తీరికగా లేచి చూచి
'పిన్ని దమ్ముల్లుంచవలెను
మిన్ను విరిగి పడుట' కనెను.

'కన్నవారి నెపుడు వేయి
కన్నుల కనిపెట్టి యుండు
కన్నతల్లి' అని మాకీ
కథ చెప్పెను పంతులమ్మ.

పంతులమ్మ చెప్పుచును
న్నంతసేపు నీవు నాన్న
కథలో నున్నట్లె నాకు
కన్నుల బొమ కట్టినారు.

నిజముగ నాన్నారులేని
నిసిరాతిరి మనకు భయము
అంటునె నీప్రక్క జేరి
అంటి యుంటి పండుకొంటు.

అమ్మా! మా బడికి పంతు
లమ్మగారు వచ్చారే
కొట్టదసలు బలే బలే
పిట్టకథలు చెపుతుందే

*

బిడ్డా !

పచ్చని పైరులపై అర
విచ్చిన మొగ్గల పైన
ముచ్చటగా రంగులేల
అచ్చుగ్రుద్ద బడెనో తెలిసె,

అందమైన రంగు రంగు
ఆట వస్తువులను రేగ.

పొంగే జలనిధి తరంగ
భంగిమముల పొడగాంచిన
పుడమి యెడద యేల పొంగి
పులకించునో నాకు తెలిసె,

నా పాటలకలరి నీవు
నాట్యము చేస్తున్నప్పుడు.

పుష్పాడి పొన్నెల లోపల
పొదిగిన మకరందమునకు
ఫలముల మాధుర్య మేల
కలిగెనొ నా కర్థమయ్యె,

తీయని తాయిలములు నీ
కీయగ నే తెచ్చినపుడు.

ప్రభారోచి ప్రభవించే
పవనాంకూరము లెంతటి
హాయిని గొని వచ్చునొ నా
కవగత మైనది కన్నా!

వద్ద జేర్చుకొని నీ కొక
ముద్దిడి నవ్వించు నపుడు.

*

# ఓదార్పు

చిఱునవ్వు లొలికించు
చిన్నారి నీ కనులు
కన్నీరు నింపుటకు
కారణం బేమిరా?

చేతి వ్రేళ్ళతొ సిరా
చేసుకొనగా ముఖము
మరకల్లుగని నిన్ను
మురికి వాడని నార?

చందమామ ముఖాన
కందు గలదని వాని
నంద హీనంబయ్యె
నందురా వారు?

చిఱునవ్వు లొలికించు . .

ఆటలాడుచు దుస్తు
లను చించుకొంటి వని
అందు కెవరైన నిను
అంద హీనుండనిర ?

చీలి పోయిన మబ్బు
పీలికలలోనుండి
నవ్వే వసంతోద
యము నేమనగ వచ్చు ?

చిఱునవ్వు లొలికించు...

తీయ తీయని తాయ
లములు కోరెద వంచు
నిను దురాశా పరుం
డని తిట్టిరా ? బాబు !

నిన్నెత్తి ముద్దాడ
నిరతంబు కోరెడి
మము బోంట్ల నింక యే
మని పిల్తురో వారు ?

చిఱునవ్వు లొలికించు

★

# వా న రో జు

ఆరుబయటికి పోకు నా బం
గారు తండ్రీ! ఆటలాడగ.

తాడిచెట్లదె చూడు! రొదతో
తలలు మిన్నును కొట్టుచున్నవి,
మురికి రెక్కలు ముడిచి కాకులు
చింత చెట్లకు చేరుకొన్నవి,

అంతకంతకు కారుమేఘము
దొంతరులు దొంతరులు కట్టెను,
చిమ్మచీకటి పడి తుపానదె
క్రమ్మి వచ్చెడి తీరు నున్నది;

ఆరుబయటికి పోకు నా బం
గారు తండ్రీ! ఆటలాడగ.

తల్లికంటక పరుగు తీసెడి
పిల్లవాని విధాన జలములు
సందు గొందుల తిరిగి పాయుచు
స్వారి చేయుచు పారుచున్నవి;

కుప్పతెప్పలుగాగ గోముచు
కప్ప లఱచుచు నుండె 'బెకబెక'
చక్కరైతుల వారి యెడ్లు
దుక్కి దున్నుచు వచ్చుచున్నవి.

ఆరుబయటకు పోకు నా బం
గారు తండ్రీ! తడసెదవుగ.

పల్లె పడుచులు జలములను గొని
పరుగు పరుగున వచ్చుచుండిరి,
మేఘమాలలు జాగిలము లటు
వేగముగ పరుగెత్తు చున్నవి,

కొమ్మ కొమ్మను దూకి చెట్లను
కుమ్ములాడుచు నుండె గాలి,
నేల చిటచిట లాడు చున్నది
కాలు జారెడు నేల బురదవు,

ఆరుబయటికి పోకు నా బం
గారు తండ్రీ! ఆటలాడగ.

'హోరు' మని సంద్రమ్ము సింహము
ఘోరుగా గర్జించు చున్నది,
ఆవు 'అంబా' యంచు లేగల
బేగి రమ్మని పిలుచు చున్నవి,

వీధి నెవ్వరు పురుగు నడచుట
లేదు కను మదె ప్రొద్దు గ్రుంకెను,
ఇందె దీపము పెట్టి వచ్చెద
ఎందు బోవకు మిందె యుండుము,

ఆరుబయటికి పోకు నా బం
గారు తండ్రీ! ఆటలాడగ.

★

# పాపకాపురం

చిన్నారి మాపాప
కెన్నెన్నియో ఊహ
లింత లేదిపుడె తన
కంతయును తెలుసు.

చెక్క బొమ్మను తెచ్చి
ప్రక్కలో వేసుకొని
పాలిచ్చి మా పాప
జోల పాటలు పాడు;

కాపురమ్మును దిద్దు
కొను నాడు పాపాయి
కడుపు చల్లగ సుతుల
గని పెంచుకొను నేమొ!

చిన్నారి మాపాప...

'వాసు' బావను పెండ్లి
చేసు కొమ్మంచేను
సిగ్గుతో తలవంచి
'చీ చి' నాకొద్ద నునుః

'రాము' పేరును నోట
రానీయ దెందుకో!
అతని జూచితె పైట
కగుపించ దిప్పుడే.

చిన్నారి మా పాప...

లక్క పిడతల తోడ
పాయసాన్నంబులను
వండ నలయదు అతిథు
లరుగు దెంచుచు సున్న;

పెద్దదై తన గృహము
దిద్దుకొను నపుడామె
'అన్నపూర్ణకు నుద్ది
యవునేమొ అవునేమొ?

చిన్నారి మా పాప...



12

పాప ఊహలు క్రియా
రూపంబు దాల్చగా
ఇంతు లంపున మేలు
బంతి యగుట నిజంబు ;

‘పూవు పుట్టంగానె
తావి దాల్చు’ నటన్న
సామెతను మా పాప
సార్థక మ్మొనరించు.

చిన్నారి మా పాప
కెన్నెన్నియో ఊహ
లింతలే దిపుడె తన
కంతయును తెలును.

*

## 'మాతృదేవో భవ'

చిన్ని నా బాబుపై
ఎన్ని చెప్పిన మీరు,
అతని దోషాలేవొ
అన్ని నే నెరుగుదును;

అతడు నా చిన్నారి
యై ఉండగాను
మంచిచెడ్డల విచా
రించగా నేల ?

మంచి చెడ్డల పోల్చి
యెంచితే నా కాత
డెంత ప్రియతము డగునొ
ఎట్లు తెలియును మీకు ?

అతడు నాలో భాగ
మగుట నే దండించి
నన్ను నే దండించు
కొన్నట్లు భావింతు.

నా వలన నా చిన్ని
నాన్న కన్నుల గార్చ,
హృది బదాబదలుగా
ప్రిదిలి వాపోయెదను ;

'ప్రేమించు వానికే
దండించు నధికార'
మందుకే సర్వాధి
కారి నాతనిపైన.

★

# తీరని సంబంధము

ఏ అనంతాంబోధి
    కేత మెత్తియు నీవు
ఏరుకొంటివి నన్ను
    కోరు కొంటివి తల్లి ?

తల్లి :

పసి తనమ్మందు వి
ప్పారు కొను నా హృదయ
కమలమున సౌరభము
వై తిరిగితివి నీవు.

కుసుమించు చున్న నా
మిసిమి రూపంబులో
నూనూగు వోలె నా
మేన మెన్నావురా !

నిష్ఠతో నే గొల్చు
ఇష్టదేవత చెంత
నిల్పి నా హృదయాన
కొల్చు కొంటిని నిన్ను.

అందాలు చిందు నా
ఆట వస్తువులలో
అన్ని నీ రూపు లై
అగుపించి నాయిరా!

పెక్కు లేటికి నాదు
ప్రేమ జీవితములో
ఆశలన్నింట, మా
అమ్మ జీవితములో;

అణువణువులను ర క్త
కణములన్నింట నా
జీవితములో నీవు
జీవించితివి నాన్న!

ఎనలేని విశ్వాసం
పద మైన నీవు నా
కరము అందున చిక్కు
కొని యుంటివిర ఇపుడు;

అన్న ! నీ ముఖము నే
నవలోకనము చేయ
అవ్యక్త మధుర భా
వము లేవా మొలకెత్తు.



# మఱ్ఱితల్లి

కోనేటి గట్టుపై
  కోటి కొమ్మలు చాచి
నీడ నిచ్చుచు నున్న
  ఊడల్ల మఱ్ఱీ!

పిట్ట బాలెంత తన
పొట్టమేతకు బోవ
బొట్టెలను ఉయ్యాల
తొట్టి సూపిన యట్లు

కొమ్మ లూపుచును ఆ
కుల తోడ సంగీత
మాల పించెదవు భా
వా తీతముగ నీవు
  కోనేటి గట్టుపై...

పల్లెలో నున్నట్టి
పెల్ల లందరు చేరి
'ఊడలం దూగెదరు
ఉయ్యాల జంపాల'

వాలు కొమ్మల నెగిరి,
వంచి గుజ్జాలెక్కి
'చల్ చలా' నీ పైన
స్వారి చేతురు వారు
కోనేటిగట్టుపై...

తాత తండ్రుల నుండి
తరతరంబుల వారి
బొమ్మరిళ్ళను కోతి
కొమ్మచ్చు లాడిరట,

కల్ల కపటము లేని
పిల్లవాండ్ల చరిత్ర
శాశ్వతమ్ముగ నీలో
శాసనమ్మయి నిలిచె
కోనేటిగట్టుపై...

పిట్ట పాపలు పైన
రెట్ట వేయుచునున్న
బాలు లెందరో క్రింద
గోల చేసిన గాని,

కన్నతల్లి విధాన
కలత జెందవు సుంత
తల్లులకు తల్లి వే
మఱ్ఱితల్లీ నీవు!

కోనేటి గట్టుపై
కోటి కొమ్మలు చాచి
నీడ నిచ్చుచునున్న
ఊడల్ల మఱ్ఱీ!

*

# పాపనిద్ర

పాపాయి కనులపై
పరుగులెత్తెడి కునుకు
లెవరంపి రెవరంపి
రెటనుండి ఎటనుండి ?

అడవిలో శీతల
  చ్ఛాయ లమరిన చోట
మిణుగురుల కాంతిలో
  మెరసి పోయెడి తోట.

అందులో లే మొగ్గ
లంపగా యీ నిద్ర
ముద్దుపాపల కనుల
మూద్దాడ వచ్చెనట.

నిదురించు పాపాయి
అధరమున తొఱు కాడు
చిఱునవ్వు కెరటాల
చిత్రించి నారెవరో ?

మంచులో జలక మా
డిన సంధ్య స్వప్నాన,
నింగిలో అపు డపుడె
నిర్గ మించుచు నున్న,

చంచత్ శరన్మేఘ
పంచు లెల్లను చిదిమి
నెలవంక తెలి కాంతి
కిరణమ్ము తెచ్చెనట.

పసిడి మేనికి మెరుపు
మిసమిసలు కల్పించి
తీయగా పాపణ్ణి
తీర్చి దిద్దిన చెవరో ?

అమ్మలో నవ యౌవ్వ
నమ్ము తొంగిచూడు నపు
డామె హృదయాంత రాం
తరము లందున దాగి,

పొంగి వచ్చే ముగ్ధ
ప్రేమ రూపము దాల్చి
పాపాయి మేనిపై
పారాడ సాగెనట.

## ప సి భా వా లు

‘ఛీఛి’ అని మన మతని
చీదరిస్తేను
‘కిలకిలా’ అని నవ్వు
లొటుక బోస్తాడు.

పలుకరిస్తే మారు
పలుకని వాడు
మనసులో తను తానె
మాటాడు కొనును.

వస్తాదు వలె కండ
లూరి ఉంటాడు
నడువ జాలక తప్ప
టడుగు వేస్తాడు.

పట్టుమని ఒక చిన్న
పని చేతగాదు
తీరికే లేకుండ
తిరుగు తుంటాడు.

చూపులకు పసిగాయ
చోద్య మేమంటే
బోసి తాతయ్యా సా
వాస మెప్పుడును.

లోక మేమైన తన
కేకొదువ లేదు
అమ్మ చల్లగ వుంటె
అంతి యే చాలు.

'బాలు డీతం డని
భావింప రాదు'
అతని భావా లెవరి
కర్థమే కావు.

★

# సముద్రతీరాన

ఆడు కొంటున్నారు
అందాల పాపల్లు!
అవధి దొరకని గంభీ
రాంబుధి తీరాన.

కవ్వించి సంద్రంబు
గర్జించు కొనుచుండ,
నిర్మలం బగు నింగి
నీలి నీడల క్రింద
ఆడు కొంటున్నారు...

ముద్దుపాపల జూచి
మురిసి పోయిన జలధి
లక్ష గొంతుల తోడ
లాలి పాటలు పాడ
ఆడు కొంటున్నారు..

పుడక లాకులు తెచ్చి
పడవేసి ఒక్కొకటి
కడలిపై తేల 'నా
పడవ నా పడ' వంచు
ఆడు కొంటున్నారు ..

కొంటె కెరటా లొచ్చి
కొట్టి పోవుచు నుండ
తడిచి మోములు ఉబ్బి
కుడిచి గొల్ల నుచును
ఆడు కొంటున్నారు...

గులకరాలే తమకు
గుప్త ధనముగ నెంచి
వెదకి కొంచును మరల
వెదజల్లు కొనుచును
ఆడు కొంటున్నారు...

కడలి గర్భము లోని
బడబానలము రగిలి
'బగ్గు' మని లోకాల
బుగ్గి చేయుటె తెలియ
కాడు కొంటున్నారు...

*

# పరిచర్య

ప్రొద్దు పొడుపున నీవు
ముద్దు లొలికించుచూ
బంగారు బంతివలె
పరుగెత్తు కొచ్చావు

కావి రంగుల వలువ
కట్టి పంపిన దెవరు ?

తల్లి నిను జూచుకొని
ఉల్ల ముప్పొంగగా
ఆరు బయటకు పోయి
ఆడు కొంటున్నావు

కవ్వించి లోలోన
నవ్వింతు రెవరురా ?

మెల్లగా నీ వమ్మ
మెడ కౌగలించుకొని
ఆమె చెవిలో యేమి
టర్థించు చున్నావు ?

పున్నమీ జాబిల్లి
పండు తెమ్మంటివా ?

౨

తల్లి ఒడిలో నీవు
తల దూర్చి నిదురింప
మిన్ను తన వేవేల
కన్నులను గనుచుండు.

గాలి నీ అందాల
కాలి గజ్జెల రవళి
తనివి తీరక మోసు
కొని పోవుచున్నాడు.

బాల భానుని లేత
బంగారు కిరణాలు
లేత మేనికి పసిడి
పూత పూయుచు నుండు;

నిదుర పోయెడి నిన్ను
కదిలించగా లేక
చూచి కన్నుల ప్రభా
రోచి ముద్దిడి పోవు.

ఉదయ కాంతులతోడ
ఎదుర కన్నెలు వచ్చి
కలలోని క్రొత్త లో
కాల గొని పోయెదరు.

ప్రకృతి యంతయు నీకు
పరిచర్య చేయ నీ
మాత చెంగటను భూ
మాత చల్లని ఒడిని
వరుసగా వే యేండ్లు
వర్ధిల్లు నా తండ్రి!

*

## పాపయెత్తులు

తలచుకొంటే పాప
తక్షణంబే యెగిరి
స్వర్గ సీమల లోన
సంచరించును కాని —

తల్లి హృదయము లోన
తల దూర్చి నిదురించు
హాయి మరగిన ఆత
డమ్మ నెట్టుల వీడు ?

భావ గర్భితముగా
పలుక నేర్చియు పాప
మాతృదేవత చెంత
మౌన మెందుకొ తెలుస ?

అమ్మ పల్కెడి కమ్మ
కమ్మన్ని మాటలను
ఆలకించుటకు న
ట్లతడు మూగ నటించు —

వెల లేని సిరులతో
తుల తూగ గల పాప
తల్లి ప్రేమలను పిచ్చి
పుల్లాయి వలె తిరుగు —

అమ్మ ప్రేమ ధనంబు
నర్థించి అతడట్లు
తిరుగు చుండును దిగం
బర భిక్షుకుని వోలె —

ఆనందమున తేలి
ఆడు చుండెడి పాప
ఏడ్చి బొబ్బలు పెట్టు
నెందుకో తెలిసెనా ?

ఓటు నవ్వు పెరటాలు
దొరలు చల్లని తల్లి
ఎత్తి లాలింప ఏ
ఎత్తు వేసె నతంతు —

స్వేచ్ఛగా 'నెలవంక'
సీమలో విహరించు
నేర్పెరంగిన యాత్ర
దోర్పుతో నిట దిరుగు —

ఆనందమయి జనని
ఆమె కౌగిట జిక్కు
టంత కంటే స్వేచ్ఛ
ఆనంద మేమి టిక ?

# పెడదారి

ఎంత దూరం ? ఎంత దూరం ! !!
చెప్పు కొనవే నేడు మార్గము
తప్పుకొని నే పోయి వచ్చిన
దెంత దూరం ? ఎంత దూరం ? ?

కుట్టి వీ డెట కేగులే, యివి
కోత లను కొనుచుంటి వేమో ?
ఎంత దూరము పోతినో నీ
స్వాంతమున నూహించి యుండవు !
ఎంత దూరం ! ఎంతదూరం !!

వీథిలో కను గొంటి వేమో ?
కాదు కాదులె వీథి దాటితి ;
'వాసు' యింటికి పోతినా మరి ?
వారి యిల్లును దాటి పోయితి.

వరద నిండుగ పొంగి వచ్చెడి
వాగుకూడా దాటి పోయితి;
తాటి తోపుల భీతి గొల్పెడి
బాటలం బడి నడచి పోయితి
ఎంతదూరం ! ఎంతదూరం !!
కొండలం బడి చెంచెలం బడి
ఇంకపోయితి నింకపోయితి,
తలచుకొంటే యిపుడు గుండెలు
జలదరించుచు నుండెనమ్మా !
ఎంతదూరం ! ఎంతదూరం !!
ఇట్టులే మరికొంత దూరము
ఇంక పోయితి నింకపోయితి,
పోవ పోవగ త్రోవ దప్పితి
పోయి నే నొక అడవి చిక్కితి
ఎంతదూరం ! ఎంతదూరం !!
అంతు తెలియని భీకరాటవి
నెంత తిరిగితి నెంత తిరిగితి !
ఎంత తిరిగిన నేమి లాభము ?
ఎవ్వరుందురు ? ఏది మార్గము ?

ఇంతలో నొక కొండమ సింగము
గంతవేయుచు వచ్చుచున్నది,
ఏమిచేయుదు నింక చెప్పవె?
ఎక్కితిని ఒక పేద్ద వృక్షము;

దానిపై నొక ఎలుగు బంటియు
తావరంబట నుండె చూడుము,
'వెనుక నుయ్యా ముందుగొయ్యా'
ఎగిరి పోయెను ప్రాణ మప్పుడు.

ఇవ్విధముగా నుండినప్పుడు
ఎవ్వరైనా యేమి చేత్తురు?
అమ్మ అమ్మా! చెప్పుకొనవే
అసలు నే నెటు తిరిగి వస్తినో?

వేకువనె గద్దించి పెద్దగ
కేక వేస్తివి గాదె అక్కను?
అప్పుడే నే త్రుళ్ళి పడితిని
అమ్మ! నాకల కరిగి పోయెను.

